తే. జను మటవిఁ గాంత హితధర్మజననిఁ బాసి
నట్టి ముగ్ధుం డవాచ్యక్రియార్హుఁ డనిన
నయ్యెడ దురుత్తరోక్తి యానతని నెఱిఁగి
వేగ రమ్మన లసమానవృత్తి మెఱయ. 20

టీ. హరి. ఆవేళన్, ఆ, శుచిభావసవిత-శుచిభావ = శుచిత్వమందు, సవిత = సూర్యుఁడైనవాఁడు, నవ...ధీరుఁడు - నవనాకరాజ్య = నూతనస్వర్గరాజ్యముయొక్క, ఆకలన = సృజనమందు, ఏకధీరుఁడైనవాఁడు, (విశ్వామిత్రుఁడనుట.) అలఘు...చితున్ - అలఘుఁడైన, పర్ణాద = ఋషియొక్క, (కశ్యపునియొక్క యనుట.) గోత్రముచేత, అంచితుఁడైనవాని, కుండలిగణములో = సర్పసమూహములో, విఖ్యాతి, (ఈశబ్దముచేత నద్వితీయకువచ్చిన ప్రథమ.) కనినభవ్యతరుఁ - కనిన = కాంచిన, భవ్యతరు (న్), మహాతక్షకున్ = (తక్షకుఁడను సర్పముననుట.) పావన...త్తమ - పావనవ్రత = పవనవ్రతసంబంధమైనకులమందు, పవనాశను లగుసర్పములయొక్క కులమునం దనుట.) ఉత్తమ = శ్రేష్ఠుఁడైనవాఁడా! సంబుద్ధి. చక్రవర్తిదారకునికిన్ = హరిశ్చంద్రనందనునికి ('దారకౌ నందనోర్భకః' ధనం.) కాంత...జననిన్ - కాంత = ఒప్పుచున్న, హితమైన, ధర్మముగల, జననిన్ = తల్లిని, ముగ్ధుండు = సౌందర్యవంతుఁడైన లోహితుఁడు, అవాచ్యక్రియార్హుఁడు = అవాచ్యమైన, క్రియకు (మరణమున కనుట), అర్హుఁడు, అనినన్, దురుత్తరోక్తి - దురుత్తర = దాఁటశక్యముగాని, ఉక్తి = వాక్యములు గలవాఁడు, ఔ, అతనిన్ = ఆవిశ్వామిత్రుని, వే = వేగముగా, గరమ్ము = విషము.

నల. ఆవేళన్, ఆశుచిభావసవిత-శుచిభావ = పరిశుద్ధహృదయమైన దమయంతియొక్క యనుట. ఇది నిడుపు లుడుపఁ దెనుఁగుషష్ఠి. సవిత = తండ్రి, (భీముఁడనుట.) నవ...ధీరుఁడు-నవన = స్తోత్రమునకు, ఆకరమైన, ఆజి = యుద్ధముయొక్క, ఆకలనమందు, ఏకధీరుఁడైనవాఁడు, అలఘు...గోత్రాంచితున్ - అలఘువైన, పర్ణాదుఁడనెడు, గోత్ర = పేరుచేత, అంచితున్ = ఒప్పుచుండెడువానిని, కుండలిగణములోన్ = సోమయాజిసంఘములో, విఖ్యాతిగనిన్ = విఖ్యాతినిధియైనవాని, అభవ్యకు...తక్షకున్ - అభవ్య = అశుభములనెడు, తరు = వృక్షములకు, మహాతక్షకున్ = ఛేదకుఁడైనవాని, పావనవ్రతకులోత్తమ! సంబుద్ధి. చక్రవర్తిదారకు = నలునిభార్యకు, ఉనికిఁగానను = సిలుకడనుగానను (ఆయమ బ్రతుకునట్టులేదనుట.), ఆవాస = వస్త్రహీనురాలైనది, ఘనదీనదశ = అధికమైన దీనదశగలది, అయ్యెన్! (వస్త్రార్థముతో మిక్కిలి దీనురాలైన దనుట.) ఆబాలవరున్ = ఆదమయంతి భర్తయగు నలుని, అటవిన్ = అడవియందు, హితధర్మజననిన్ - హితధర్మమునకు, జననిన్ = కారణమైనదానిని, ముగ్ధుండు = మూఢుఁడు, ('ముగ్ధస్సుందర

మూఢయో' రితి విశ్వః.) అవాచ్యక్రియకర్తృఁడు, వచింపయోగ్యుఁడు గాఁడు, అనినన్ =ఇట్లని నీవుసెప్పఁగా,దురుత్తరోక్తి=దుష్టమైన ప్రత్యుత్తరోక్తిగలవాఁడు, వినయతనిని, ఎఱిఁగి = తెలిసికొని, వేగ, రమ్మన=రమ్మనఁగా, లసమానవృత్తి, మెఱయన్ = ప్రకాశింపఁగా.

చ. అనవధికోపకారి యతఁ డారయుచున్ గహనప్రదేశముల్
సని సరసర్తుపర్ణవిలసన్నగరాజిరసన్నుతంబు లై
తనరు వినూత్నపత్రసముదాయములన్ భరియించుచొక్కకే
వనెసఁగువాని నక్కుఱుచవానిఁ గ్రమంబునఁ జేరఁ బోవుచున్. 21

టీ. హరి. అన...కారి-అనవధి = మితిలేని, కోపము, కారి=చేసెడువాఁడు, అతఁడు=ఆతక్షకుఁడు, గహనప్రదేశముల్ = కాననస్థలములను, అరయుచున్=వెదకుచును, చని=పోయి, సరస...రసన్-సరసమైన, ఋతువుగల, (కోయఁబక్వములైన యనుట.) పర్ణ=ఆకులచేత, విలసత్=ఒప్పుచుండెడు, నగ=వృక్షములయొక్క, రాజీ=పంక్తులుగల, రసన్=భూమియందు, వినూ...యములన్ - వినూతనములైన, పత్ర=ఆకులయొక్క, సముదాయముఃన్, భరించుచు=వహించుచు, కుఱుచవానిన్=పిన్నవానిని, (లోహితు ననుట.)

నల. అనవ...కారి-అనవధికమగునట్లులు, ఉపకారి=ఉపకర్తయైనవాఁడు. అతఁడు=ఆపర్ణాదుఁడు, గహనప్రదేశముల్-గహన = చోరశక్యముకాని, ('కలిలంగహనం సమే' అ.) ప్రదేశముల్ = ప్రకృష్టస్థలములను, (ఆరయు నని పూర్వముతో నన్వయము.) సరస...సన్నుతంబులు - సరసమైన, ఋతుపర్ణునియొక్క, విలసన్నగర=ఒప్పెడు పట్టణముయొక్క, అజిర=ముంగిటియందు, సన్నుతంబులు, ఐ, తనరు...యములన్ - తనరుచుండెడు, వినూత్నములైన, పత్త్ర=గుఱ్ఱములయొక్క, సముదాయములను, భరించుచు=రక్షించుచు, అక్కుఱుచవానిన్ = ఆపొట్టివానిని.

క. ఆలోకించి తదుక్తవ
చోలీలన్ మర్శమంటి సోలఁగ నవనిన్
దాలపనదుర్విషహతా
లోలాత్మునిఁ జేయ ఘూర్ణిలుచు నచ్చోటన్. 22

టీ. హరి. తదుక్తవచోలీలన్-తత్ = ఆవిశ్వామిత్రునిచేత, ఉక్తమైన, వచోలీలన్, మర్శమంటి = ఆయమునుస్పృశించి, అవనిన్ = భూమియందు, సోలఁగన్=వ్రాలునట్లుగా, తా(న్)=యను, (తక్షకుఁ డనుట.) లపన...లాత్మునిన్ - లపన=ముఖ

మునందలి, దుర్విషముచేత, హతమై, ఆలోల=నిశ్చేష్టితమైన, ఆత్మని = దేహముగల వానిని.

నల. తదుక్తవచోలీలఁ-తత్=ఆభీమునియొక్క, ఉక్తవచోలీలను, మర్మము, అంటి=తాకి, సోలఁగ = పడునట్లుగా, నవ...లాత్మునిఁ - నవ=క్రొత్తలైన, నిందాలపన =నిందావాక్యములయొక్క, దుర్విషహతా = శమింప శక్యముగాకుండుటచేత, లోలాత్మునిఁ, చంచలమానసుని, చేయఁగా.

సీ. అతఁడు మోహము గలయంగ నసన్మతి
స్థిరత నిల్చుట దక్క వరుసవిధివి
పాకసమాసక్తిఁ బలువగ నాటింప
హా యసమాన యమ్మా యటంచు
నుదిరి పడినఁ గాంచి యొగిఁ బఱతెంచి యా
చంద మంతయుఁ దద్ద్విజాతిపృథుకు
లారూఢి గురునకు నాక్షణంబునఁ దెల్ప
నాత్మ లోహితు సేగి నబల యొఱఁగి
తే. నానిధానంబ నను బాసి కాన నెచటి
కేఁగి [1]తింక ని న్గన్నార నెట్లు గాంతుఁ
గలికి నునుమేని నిను భోగి గాసిపెట్టఁ
దగునె యని చాల మూర్ఛిలి మగుడఁ దెలిసి. **23**

టీ. హరి. అతఁడు=ఆలోహితుఁడు, మోహము=మూర్ఛ, కలయంగ, అసన్మతిస్థిరత=సన్మతిస్థిరుఁడు కాకుండుటచేత, నిల్చుటఁదక్క, (నిలువలేకయనుట.) వరుస, విధి=దైవము, విపాకసమాసక్తిచేత, పలువగ=అధికదుఃఖమును, నాటింపఁ=(తెచ్చిపెట్టఁగాననుట.) హా! అసమాన! అమ్మా (సంబోధనలు.) ఉదిరి పడినన్=పడఁగా, తద్ద్విజాతిపృథుకులు=ఆవిప్రకుమారులు, గురునకున్=కాలకౌశికునకు, తెల్పఁ, ఆత్మయందు, లోహితు సేగి=లోహితునియాపదను, అబల=చంద్రమతి,కలికి...నిను(న్)=కలికియైన, నునుమెయిగలనిన్ను, భోగి=సర్పము.

నల. అతఁడు=ఆనలుఁడు, మోహముగల, అంగన, వరు(న్)=పెనిమిటిని, సవిధవిపాకసమాసక్తిన్, (దైవోపహతుఁ డైనవానిననుట.) పలువగన్, నాటింప=నాటించుటకు, అసమా=యశమా? నయమ్మా=నీతియా? (కీర్తియో? న్యాయమో? యనుట.) తద్ద్విజాతి =ఆపర్ణాదుఁడను బ్రాహ్మణుఁడు, పృథుకులారూఢి - పృథు = అధికమైన, కులారూఢిగల

[1] తిక నిన్నుఁ గన్నార.

వాఁడు, గురునకున్=తండ్రికి, ఆత్మలో, హితుసేగి, ప్రియుని చెలుపు, అబల=దమయంతి, కలికి=కలిపురుషునకు, నును మేని నిను=బాగైనశరీరము గలనిన్ను, భోగి(న్)=భోగము గలవానిని.

క. మన మెరియఁగ వనరుచుఁ దను
గొనితెచ్చినవిప్రుఁ గాంచి గుణరత్నమహా
ఖని యార్యపుత్త్ర నరయం
జనవలయుఁ గృపారసంబు సంధింపు మదిన్. 24

టీ. హరి. తనున్,కొని తెచ్చిన=పిలిచి తెచ్చిన, విప్రున్=కాలకౌశికుని, గుణరత్నమహాఖని! ఆర్య! సంబుద్ధులు.

నల. తనున్=తన్ను, కొని తెచ్చినవిప్రున్=తోడుకొని వచ్చినసుదేవుఁ డనుబ్రాహ్మణుని, గుణరత్నమహాఖని, సంబుద్ధి. ఆర్యపుత్త్ర ని=పెనిమిటిని, (నలు ననుట.) భర్తనార్యపుత్త్రుండనుట నాటకములయందుఁ బ్రసిద్ధము.

చ. అని నతు లాచరింప హృదయంబున [1]నింతయు వంతఁ బూన క
మ్మనుచు ద్విజుండు సత్కరుణ మాని మదిన్ వడిఁ ద్రోచి యేఁగెనూ
తనతరసంభ్రమం బెసఁగఁ దత్ప్రమదాజనకోక్తిభంగి ని
ట్లనియె నయోధ్య నేలువసుధాధిపుభార్యమునీడితోన్నతిన్. 25

టీ. హరి,అమ్మనుచు ద్విజుండు=ఆపోషించు బ్రాహ్మణుఁడు(కాలకౌశికుం డనుట.), సత్కరుణ, మాని=విసర్జించి, తత్ప్ర...భంగిన్-తత్=ఆచంద్రమతియొక్క, ప్రమద=సంతోషమునకు,అజనక=హేతువుగాని,భంగిన్=తీరున,అయోధ్యకు, ఏలు...భార్యన్=ఏలెడునట్టిరాజు (హరిశ్చంద్రుని) యొక్క, భార్యను, మునీ...న్నతిన్-మునీడితమైన, ఉన్నతిగలదానిని, ఇట్లనియెనని పూర్వముతో నన్వయము.

నల. వంతన్, పూనకు, అమ్మ అనుచు, సత్కరుణము = లెస్సయగు కరుణారసమును, మదిన్=మనస్సున, ఆని=పానము చేసి, తత్ప్రమ...భంగిన్-తత్ప్రమదా=ఆదమయంతియొక్క, జనక=తండ్రియైన భీమునియొక్క, ఉక్తిభంగిని, భార్యమున్, భా=తేజస్సునందు, అర్యమున్=సూర్యుఁడైనవాని, మునీ...న్నతిన్-ఈడిత=నుతింపఁబడిన, ఉన్నతిగలవానిని, అయోధ్యన్, ఏలు, వసుధాధిపున్ = ఋతుపర్ణునిగూర్చి, ఇట్లనియె ననియన్వయము.

తే. ఇచటి యావశ్యకక్రియ లెల్ల మట్టు
పఱిచి యోసత్యవాక్ప్రియా! పటురయమునఁ

1 నెంతయు.

జను వరాటవిభూపాంతమునకుఁ దగఁద
దాత్మభూస్వయముద్వహనాప్తి కనిన. 2

టీ. హరి. ఓసత్యవాక్ప్రియా! సత్యవాక్=సత్యవచనముగల హరిశ్చంద్రున
ప్రియా=ప్రియురాలవైన యోచంద్రమతీ! సంబుద్ధి. వరా...తమునకున్-వరమైన, అ
విభూ=అరణ్యముయొక్క, ఉపాంతమునకున్=సమీపమునకు, తదా... ప్తికిన్-తత్
ఆ,ఆత్మభూ=కుమారుఁడైన లోహితునియొక్క, స్వయముద్వహనముయొక్క, ఆప్తికిన్
(ఆపుత్త్రుని నీవు సంరక్షించుటకొఱకనుట.) ఇటనటవీశబ్దమికారాంతముగఁ బ్రయోగి
చుటకుఁ బూర్వప్రయోగము.—

క. "అతిసత్త్వస్థవిరాటవి, తతనగరుచిరప్రచారతన్ నుతికెక్కన్
ధృతినరసి రాముభార్యన్, రతిఁగానక కాంతిభంగ రణతనులీలన్.
(రాఘవపాండవీయము-

నల. సత్యవాక్ప్రియా=సత్యవచనమే ప్రియముగాఁగలవాఁడా! సంబుద్ధి. వరా
టవిభు=భీమునియొక్క, ఉపాంతమునకు, చనుము. తదా... ప్తికిన్-తత్=ఆభీముని యొ
క్క, ఆత్మభూ = కూఁతురైన దమయంతియొక్క, స్వయముద్వహన=స్వయంవరమ
యొక్క, ఆప్తికి.

క. నరపతి ముదితమతిన్ దు
స్తరమోహతమిస్ర మెనసి చంచలనయనా
వరణ మొనర్చ భరంపడి
ధరణీసురకథితవేళఁ దప్పక చనుచోన్. 2

టీ. హరి. నరపతి ముదిత=చంద్రమతి, మోహతమిస్రము = మూర్ఛాంధకా
రము, చంచల...రణము-చంచలములైన, నయనములయొక్క, ఆవరణము=ఆచ్ఛాద
నము, ఒనర్చ, ధరణీసురకథితవేళన్=కాలకౌశికుఁడు చెప్పినసమయమునందు.

నల. నరపతి=ఋతుపర్ణుఁడు, ముదితమతిన్=సంతుష్టమతిచేత, దుస్తర... స్ర
ము-దుస్తరమైన, మోహతమిస్రము=మోహాంధకారము, చంచలనయనావరణము(న్),
చంచలనయనా=దమయంతియొక్క, వరణము=వరించుటను.

చ. అతులితదూరమార్గగమనైకపరిశ్రమశాలిరథ్యసం
తతిఁ బురికొల్పుచున్ దగ ననంతపథంబుఁ దరింపఁజేసె న
ఖతబహూదీప్తి వాహకుఁడు సారథి లీలఁ దనర్చి యాజగ
ద్ధితురథమున్ ద్విజాతిసముదీరితవాక్యబలీకృతాశుఁడై. 2

టీ. హరి. అతులిత...సంతతిన్ - అనంతపథంబున్=ఆకాశమార్గమును, అక్షత బహుదీప్తివాహకుఁడు, అక్షతమైన,బహుదీప్తిని, వాహకుఁడు=వహించినవాఁడు,సారథి= అనూరుఁడు, ఆజగద్ధితురథము = ఆసూర్యుని రథమును, ద్విజాతి...తాశుఁడు-ద్విజ = పక్షులచేత, అతిసముదీరిత=మిక్కిలి పలుకఁబడిన, వాక్కులచేత, కబళీకృతమైన, ఆశుఁడు=దిక్కులుకలవాఁడు, ఐ.

నల. అనంతపథంబున్ = అపరిమితమైన మార్గమును, అక్షత...వాహకుఁడు- అ,క్షతమైన, బహుదీప్తిగలవాఁడు, వాహకుఁడు=బాహుకుఁ డను పేరుగల నలుఁడు, (వబయోరభేదః) సారథిలీలన్=సారథివలెను, ఆజగ...రథమున్ - ఆ, జగద్ధితుఁడైన ఋతుపర్ణునియొక్క రథమును, ద్విజాతి...శుఁడై - ద్విజాతి=భూదేవుఁ డనుబ్రాహ్మణుని చేత, సముదీరిత=చెప్పఁబడిన, వాక్కులచేత, కబళీకృతమైన, ఆశుఁడు=ఆశగలవాఁడు, ఐ, (దమయంతీ పునస్స్వయంవరవార్తచేత, నిరాశ నొందినవాఁడై యనుట.)

తే. అపుడు వికలాంగసారథినిపుణతావి
భావితశతాంగరయవిజృంభణమువలన
ననధిగమ్యవినిర్గళితాంశుకుఁ డయి
యినుఁడు వనరాశిమధ్యంబు నెనయుచుండె. 29

టీ. హరి. వికలాంగ...వలనన్-వికలాంగసారథి=అనూరునియొక్క, నిపుణత చేత, విభావితమైన, శతాంగరయవిజృంభణమువలన, అనధి...శుకుఁడు-అనధిగమ్య = పొందశక్యముగాని, వినిర్గళిత=జారిపోయిన, అంశుకుఁడు=కిరణములుగలవాఁడు, అయి, ఇనుఁడు=సూర్యుఁడు, వనరాశిమధ్యంబు=సముద్రమధ్యమును, ఎనయుచుండెన్=పొందుచుండెను.

నల. అపుడు, వికలాంగ...విజృంభణమువలనన్ - వి=విగతమైన, కలా=కళగల, అంగముగల సారథియొక్క,(నలునియొక్క యనుట.) నిపుణత=నేర్పుచేత, విభావిత=పొందింపఁబడిన, శతాంగ=రథముయొక్క, రయవిజృంభణమువలన, అనధి...శుకుఁడు-అనధిగమ్య=పొందశక్యముగానట్లు, వినిర్గళితమైన, అంశుకుఁడు=వస్త్రముగలవాఁడు, ఐ, ఇనుఁడు=ఋతుపర్ణుఁ డనురాజు, వనరాశిమధ్యంబునన్=వనసమూహమధ్యమునందు.

సీ. తారకాపథవీథిఁ దనరునాకులు హరి
దద్వైతవిభ్రాంతి నావహింప
నరుణాంశుహరణక్రియాపదాశ్రితధైన
ఛాయనాఁ బెనుమబ్బుచాయ మెఱయఁ

ప్రతినవపల్లవభవనం బెనయుకొొమ్మ
ల నిహతాశావ్యాప్తి నధిగమింప
నాత్మమూలసమాశ్రయాతలస్థితిమైత్రి
నహులు నిర్వ్యథనైకవిహృతి మెఱయ

తే. నిజనిబిడతానిరాకులనిఖిలఘూక
పటలపటుహారక్రియారబ్ధపథికలోక
తర్జనము మహాధ్వాంత మంతయును నలమి
కొని యొనరె భూతవాస మత్యుగ్రగరిమ. 30

టీ. హరి. ...నాకులు=దేవతలు, హరి...భ్రాంతిన్-హరిత్=దిక్కులయొక్క ఆద్వైత=ఐక్యమందలి, విభ్రాంతిన్=భ్రమను, ఆవహింపన్=సంపాదింపఁగా, అరుణాంశు...శ్రిత-అరుణాంశు=సూర్యునియొక్క, హరణక్రియచేత, ఆపత్ = ఆపదను ఆశ్రిత=పొందినది, ఐన చాయనాన్=ఛాయాదేవియనునట్టుగా, పెనుమబ్బుచాయ = నైల్యము, ప్రతి...భవనంబు(న్)-ప్రతినవ=నూతనములైన, పల్లవ=విటులయొక్క, భవనంబు(న్)=గృహములను, జాత్యేకవచనము, కొమ్మలు=స్త్రీలు, అని...వ్యాప్తిన్-అనిహత=అప్రతిహతములైన, ఆశా=కోరికలయొక్క, వ్యాప్తిని, ఆత్మ...మైత్రిన్-ఆత్మ= తమకు, మూలసమాశ్రయ = మూలాధారమైన, అతల=పాతాళమందలి, స్థితిపల్లవైన మైత్రిచేత, (వికత్రావస్థాన మైత్రిచేతననుట.) అహులు=సర్పములు, నిర్వ్య...విహృతి-నిర్వ్యథ=వ్యథారహితమైన,నైకవిహృతి=అనేకవిహారములను, మహాధ్వాంతము=చీఁకటి భూతవాసము=భూతములకు నివాసమైనది.

నల. తారకాపథవీథిన్ = ఆకాశవీథియందు, తనరునాకులు=ఒప్పెడుపర్ణములు హరిత్=పచ్చఁదనముయొక్క, అద్వైత=అభేదములయొక్క,విభ్రాంతిన్, ఆవహింపన్ = సంపాదింపఁగా,(అభ్రంకషములైన యాకులుగలిగిన దనుట.) అరుణాంశు...శ్రిత-అరుణాంశు=సూర్యకిరణములయొక్క, హరణక్రియచేత, పదాశ్రిత = పాదములవ్రాలినది, ఐన, చాయనాన్=ఛాయాదేవియనఁగా, పెనుమబ్బుచాయ=పెనుమబ్బుగలనీడ, ప్రతి ...భవనంబు-ప్రతినవ=నూతనమైన, పల్లవ=చిగురుటాకులయొక్క, భవనంబు=పుట్టు వును, ఎనయుఁకొమ్మలు...శాఖలు, అని...వ్యాప్తిన్-అనిహత = అప్రతిహతమైన ఆశావ్యాప్తిన్=దిగ్వ్యాప్తిని, ఆత్మ...మైత్రిన్-ఆత్మ= తనయొక్క, మూల=వేళ్లకు సమాశ్రయమైన, అతల=పాతాళమునందలి, స్థితివల్లనైన, మైత్రిచేత,అహులు=సర్పములు, నిర్వ్య...విహృతి-నిర్వ్యథన = రంధ్రములయందలి, ఏకవిహృతి(న్) = ముఖ్యవిహార

ను, మహాధ్వాంతము = మహామార్గాంతమును, భూతవాసము=తాండ్రచెట్టు-కర్త.
హాతావాసః కలిద్రుమః' అ.)

అందు దటియంగఁ జనుదెంచి యపుడపర్ణ
గణనఁ గనునాపరమధీరమణి విచిత్ర
గతి నిరీక్షించి ఘోరాహికలితవికృతి
రాజసంతతి దైన్య మేర్పడఁగఁ బలికె. 31

టీ. హరి. అందు=ఆచీఁకటియందు, అపర్ణగణనన్ - అపర్ణ=పార్వతియొక్క, నన్=ప్రసిద్ధివంటిప్రసిద్ధిని,కను...మణి-కను=వహించిన, ఆ,పరమధీ=ఉత్కృష్టబుద్ధి , రమణి=చంద్రమతి,ఘోరాహికలితవికృతి(ౕ)-ఘోరాహిచేత, కలితమైన, వికృతి వాని, రాజసంతతి(ౕ)=రాచపట్టియగులోహితుని, ఇటఁ 'బరమధీ' యను సమస్త మున 'ధీ' యను శబ్దము మీఁది దీర్ఘము హ్రస్వముగాక నిలిచినది. ఏకాక్షరశబ్దము ం నిలుచును. ఇందులకు లక్షణము.—

క. "స్త్రీలింగంబులనిడుపులు, వాలాయము నుడుపఁదెనుఁగువచనము లగునం
దాలోలశ్రీధీహ్రీ, స్త్రీలనులపితములుదక్కఁ జిక్కిన వెల్లన్."

(కావ్యాలంకారచూడామణి.)

నల. అందు=తాండ్రచెట్టునందు, అపుడ=అప్పుడే, పర్ణగణనన్ = ఆకులయొక్కను, కను...గతి(ౕ)-కను=కనిన, ఆ,పరమ=ఉత్కృష్టుఁడైన, ధీరమణి=ధీరఁడగు ఋతుపర్ణునియొక్క, విచిత్రగతి(ౕ)=ఆశ్చర్యగతిని, నిరీక్షించి, ఘోరా...కృతి-ఘోరమైన, ఆహి=కర్కోటకసర్పముచేత,కలిత=చేయఁబడిన, వికృతిగలవాఁడు, జసంతతి=చంద్రవంశజుఁడగు నలుఁడు.

నరలోకనుతభావ నాపుణ్యనిధి బంధు
మందార భూజనానందన నిను
నే మననేర్తు నీయెడ నయో హా కానఁ
డు గురుండు నీవగ గగనమణికు
లాధార కాన నాగాగ్రగచ్ఛదసంఖ్య
గర మొందు[1]గతి యెట్లు గలిగె నయ్య
యిది నా కెటింగింపవే సద్గుణాస్తకు
తూహల విశ్వకాలోహితాశ్వ

1 టెట్టులు గలిగె.

తే. హృదయ మొనగూర్తు నీయందుఁ జెదరకుండ
  ననుచు నిజమహావిద్యాకథనపురస్స
  రముగ నమ్మానవసతి తత్ప్రాపితాక్ష
  హృత్సరణి యై యలోలత నెనసి యపుడు. 32

టీ. హరి. నరలోకనుతభావ! నాపుణ్యనిధి! బంధుమందారభూజ! నానందన! లోహితసంబోధనములు. గురుండు=తండ్రి (హరిశ్చంద్రుఁ డనుట.) నీవగ = నీదుకీఖా మును, కానన్=అడవియందు, నాగా...గరము - నాగాగ్రగచ్ఛత్ = సర్పాగ్రేసరము యొక్క, అసంఖ్య=అధికమైన, గరము=విషము, సద్గుణా...విశ్వకా=సద్గుణముల చేత, ఆప్త=పొందఁబడిన, కుతూహలముగల, విశ్వకా = సమస్తమైనవారు గలవాఁడా! లోహితాశ్వ! (లోహితులకు లోహితాశ్వుఁ డనుపేరును గలదు.) (సంబోధనములు.) నిజ...స్సరముగన్-నిజ=స్వకీయమైన, మహా, అవిద్యాకథనములయొక్క, పురస్సరముగ (అజ్ఞానవాక్యపూర్వకముగా ననుట.)అమ్మానవసతి-ఆ, మానవ=మనువంశసంభవుఁ డైన హరిశ్చంద్రునియొక్క, సతి=భార్యయైన చంద్రమతివి, తత్ప్రా...రణి-తత్=ఆలోహి తునియందు, ప్రాపిత=ఉంపఁబడిన, అక్ష = చక్షురింద్రియముయొక్కయు, ('అథాక్ష మింద్రియే నాద్యూతాంగేకర్షచక్రే వ్యవహారేకలిద్రుమే'. ఆ.) హృత్=హృదయము యొక్క, సరణి=మార్గముగలది, ఐ, అలోలతన్=నిశ్చేష్టతచేత.

నల. నర...వనా! నరలోకనుతమైన, భావనా=నిజధ్యానముగలవాఁడా! పుణ్య నిధి! బంధుమందార! భూజనానందన! ఋతుపర్ణుని సంబోధనలు. భూజనులను, ఆనం దన=సంతోషపెట్టువాఁడా! నయోహా! నయ=నీతియందు, ఊహా! =యోజనగలవాఁడా! గురుండును=బృహస్పతియు; ఈవగ=ఈవిధమున, కానన్=అడవియందు, అగా...సం ఖ్య-అగ=వృక్షములయొక్క, అగ్రమును, గ=పొందిన, ఛద=ఆకులయొక్క, సంఖ్య= లెక్క,కరము(న్)=హస్తమును, ఒందుటీరు (నేర్పుమార్గమనుట.) ఎట్లుకలిగెన్, అయ్య! సద్గుణాప్తకుతూహల! విశ్వ...హృదయము(న్)-విశ్వకాల=సమస్తకాలములయందు, ఊహితమైన, అశ్వహృదయమనువిద్యను, నిజ...స్సరముగన్-నిజ=తనయొక్క, మహా విద్యయొక్క, కథనముయొక్క, పురస్సరముగ, అమ్మానవసతి-అ, మాన=చిత్తసము న్నతికి, వసతి=నిలయుఁడైన, నలుఁడు, త...రణి-తత్=ఆఋతుపర్ణునిచేత, ప్రాపిత = పొందింపఁబడిన, అక్షహృత్ = అక్షహృదయమను విద్యయొక్క, సరణి=మార్గముగల వాఁడు, ఐ, అలోలతన్=నిశ్చలత్వముతో.

క. మగుడ నను భావవాసన
యిగురొత్తనొకింత వెలయ నీక్షించి కడున్
వగఁజిక్కి వెచ్చ నూర్చుచు
యుగావధివిమోహగరిమ నుల్లంబడలన్. 33

టీ. హరి. మగుడన్=మరల, అనున్=పలుకును, భావవాసన=తెలివి, వెలయఁగా, యుగా...గరిమన్-యుగావధి=ప్రళయమైన, విమోహ=పుత్రమోహముయొక్క గరిమ చేత.

నల. అనుభావవాసన=అతిశయవాసన, (మగుడ వెలయఁగా నని పూర్వముతో నన్వయము.) యుగావధి=కలిపురుషుఁడు, విమోహ=విగతమోహముయొక్క, గరిమను.

చ. అనుపమపుణ్యసాంద్రుఁ డగునయ్యవనీశ్వరచంద్రుఁ బాసి యి
ట్లను దినమున్ ద్విదాశ్రయసమాహితవృత్తివహించు నే భవ
త్తనుగతదారుణాహిగరదాహముఁ గాంచి విపత్పయోనిధిన్
మునిఁగితి నాపయిం గరుణ నూల్కొనఁ గాఁ గనువిచ్చి చూడవే.

టీ. హరి. ఇట్లు, అనుదినమున్=నిరంతరమును, కాంచి=చూచి.

నల. ఇట్లను(న్)=ఈతీరునఁబల్కును, దినమున్, కాంచి=పొంది.

తే. నిన్నుఁ దలఁచినవార్త నే నిలువఁ జాల
నింక నను చు నక్షాంతంబు నెనసి నంద
నవికృతిక్లేశదశఁ దత్క్షణమున వికలి
తోపలబ్ధిప్రభవధైర్యయుక్తి నడఁచి. 35

టీ. హరి. అక్షాంతంబున్=క్షాంతాభావమును (తాళిమిలేమి), ఎనసి, నంద...దశన్-నందన=లోహితునియొక్క, వికృతివల్లనైన, క్లేశదశన్=దుఃఖావస్థను, విక...యుక్తిన్-వి=విశేషముగా, కలిత=పొందఁబడిన, ఉపలబ్ధిన్=జ్ఞానమువలన, ప్రభవమైన, ధైర్యయుక్తిచేత, అడచి, (క్లేశదశఁ బోఁగొట్టి యనుట.)

నల. అక్షాంతంబున్-అక్ష=తాండ్రచెట్టుయొక్క, అంతంబున్=అగ్రమును, ఎనసినన్=పొందఁగా, తన...దశన్, తనశరీరవికారమువలననైన, క్లేశదశన్=క్లేశదశావస్థను, విక...యుక్తిన్, వి=విగతమైన, కలిత=కలిపురుషుఁడుగలవాఁ డనుటయొక్క, ఉపలబ్ధి=పరిప్రాప్తివల్ల, ప్రభవ=పుట్టిన, ధైర్యముయొక్క, యుక్తిచేత, అడఁచి=కప్పిపుచ్చి, కలిపురుషుఁడు విడువఁగా నైనధైర్యముచేత శరీరవికృతిక్లేశముఁ గనఁబడనీయనివాఁడై యనుట.

క. అలసాధ్వీడితమతి చ
క్రిలలామాక్రమణరయదురీక్షాకృతి న
య్యలఘుఁ దనయ న్మనస్స్థితి
నెలకొన నేకతమ భీమనిలయముఁ జేర్చెన్. 36

టీ. హరి. సాధ్వీడితమతి - సాధ్వీ=పతివ్రతలచేత, ఈడిత=స్తుతి చేయఁబడిన, మతిగలది, చంద్రమతి=కర్త. చక్రి...కృతిన్, చక్రిలలామ=సర్పశ్రేష్ఠముయొక్క, ఆక్రమణముయొక్క, రయ=వేగముచేత, (కఱచుటచేత ననుట.) దురీక్ష=చూడశక్యముగాని, ఆకృతిగలవాని, తనయున్=లోహితుని, మనస్స్థితి=చిత్తస్థైర్యము, నెలకొన, ఏకతమ=రహస్యముగా, భీమనిలయమున్=రుద్రభూమిని చేర్చెను.

నల. సాధ్వీడితమతి=సాధువులచేత ఈడితమైన మతిగలవాఁడు, నలుఁడు=కర్త. చక్రి...కృతిన్-చక్రి=రథముయొక్క, లలామ = అశ్వములయొక్క, ('ప్రధానశృంగలాంగూల భూషాపుండ్రప్రభావనా, ధ్వజలక్ష్మీతురంగేషు లలామనవసుస్మృతమ్'. ధనంజయము.) ఆక్ర...కృతిన్-ఆక్రమణరయ=గమనవేగముచేత, దురీక్ష=చూడశక్యముగాని, లేక,కనిపింపని=ఆకృతిగలవాని, అయ్యలఘున్=ఆఋతుపర్ణుని, తనయున్మనస్స్థితి, తనయొక్క, ఉన్మనస్స్థితి=సంతుష్టస్థితి, ('ఉత్క-ఉన్మనాః' అ.) ఏకతమ=ముఖ్యతమమైన భీమనిలయమున్=కుండినపురమును.

ఉ. ఆయెడ సార్వభౌమసతి యప్రతిరోధ్యనిశాంచితక్రమో
చ్ఛ్రాయసమేతపత్త్రరథశబ్దము వీనులఁ బర్వ నాత్మహృ
న్నాయకుఁ డైనభూవలయనాథుఁ దలంచుచు నేడ్చుచుండె
నత్యాయతపద్మినీదళగతాంబువిడంబిమనోంబుజంబునన్. 37

టీ. హరి. సార్వభౌమసతి=చంద్రమతి, అప్రతి...శబ్దము-అప్రతిరోధ్య=అడ్డగింపశక్యముగానిదై, నిశా=రాత్రులయందు, అంచిత=విజృంభితమయిన, క్రమ=సంచారములయొక్క, ఉచ్ఛ్రాయ=అతిశయముతో, సమేతములైన, పత్త్రరథ=పక్షులయొక్క 'పతత్పత్త్రరథాండజా' (గూబలు మొదలగు పక్షులయొక్కయనుట.) శబ్దము.

నల. సార్వభౌమసతి=దమయంతి, అప్రతిరో...శబ్దము - అప్రతిరోధి=ఎదురులేనిదై, అనిశాంచితమైన, క్రమోచ్ఛ్రాయ=గమనాతిశయముతోడ, సమేత=కూడిన, పత్త్ర=గుఱ్ఱములుగల, రథ=రథముయొక్క, శబ్దము, ఋతుపర్ణుని రథధ్వని విని యారథము నలునిది కాదని యెఱింగి నలుఁ దలంచుచు దమయంతి వ్యథ నొందుచుండె ననుట.) నాత్మహృన్నాయకుఁడైన=నలుఁడు కానట్టు.

తే. అప్పు డయోధ్యాధిపతియును నచటిభీమ
శాసనాధిష్ఠకర్బురస్థాపితాధి

వాసమునఁనుండి యిచటి కెవ్వారు రారు
నేఁ డిదేమొకో యనుచుఁ జింతించుచుండె. 38

టీ. హరి. అపుడు, అయోధ్యాధిపతియును=హరిశ్చంద్రుఁడును, అచటి...వాసమునన్-అచటి=ఆరుద్రభూమియందలి,భీమ=భయంకరమైన, శాసన=ఆజ్ఞచేత,ఆదిష్ట=నిర్దేశింపఁబడిన, కర్బుర=నిశాచరులచేత, స్థాపిత=నిలుపఁబడిన, అధివాసమునన్=మంచెయందు.

నల. అయోధ్యాధిపతియును = ఋతుపర్ణుఁడును, అచటిభీమ...వాసమునన్-అచటి=ఆకుండినపట్టణమునందలి, భీమభూపాలునియొక్క శాసనముచేత, ఆదిష్ట = చూపఁబడిన, కర్బురస్థాపిత = సువర్ణఖచితమైన, ('గాంగేయం భర్మకర్బురమ్' అ.) అధివాసమునన్=గృహమునందు.

క. సముచితపరిశోధనలో,ల్యము లవ్వేళన్ రుజావిలాపవ్యక్త[టయున్.
క్రమకాంతాశ్రుతి నలభూ,రమణోత్తము వెలఁదిమదికిఁ బ్రభవించు

టీ. హరి. రుజా...శ్రుతిన్-రుజా=పరితాపమువల్లనైన, విలాప=రోదనముచేత, వ్యక్తమైన, క్రమముకలుగునట్టుగ, కాంతా=ఆఁడుదానియొక్క, శ్రుతిన్=వినుటచేత, అల...మదికి(న్)-అల,భూరమణోత్తము=హరిశ్చంద్రునియొక్క, వెలఁదిమదికి=పరిశుద్ధమైన మనస్సునకు,శోధనలోలత్వములు ప్రభవించుటయునని పూర్వముతో నన్వయము.

నల. రుజా...శ్రుతిన్-రుజా=పీడచేత, ఆవిల=కలుషమైనవాఁడై, ('కలుషోనచ్ఛ ఆవిలః' అ.) అవ్యక్త = తెలియఁబడని, క్రమముగలవాఁడైన, కాంత=పెనిమిటియొక్క,అశ్రుతి(న్)=వినకుండుటచేత, నలభూరమణోత్తము,వెలఁదిమదికిన్=దమయంతిమదికి, (పరిశోధనలోల్యములు ప్రభవించుటయున్ అని పూర్వమున కన్వయము.)

సీ. హాళిఁ గాలప్రాప్తుఁడైనసంతతికిఁ ద్రో
వ ఘటింప నెవ్వారు వచ్చిరో య
టంచు నారయఁ గోరి యలసుకేశిని నను
ప మహితశీల సత్పద్ధతి నది
దొరసిన రవినుతదోర్మహాస్ఫూర్తి ప్ర
చ్ఛన్నాత్మమూర్తి యాచక్రవర్తి
యి ట్లను నతివ! నీవెవ్వరిదాన వి
క్కేలల వచ్చితి వొంటి నిచటి కనిన
తే. నవనిధవకులపాలిక యనుమహాత్ము
సాంద్రగుణబంధు రాజాన్వయేంద్రు నింటఁ

దగుపను ల్దీర్చుచుండెడుదాన ధాత్రి
నినుఁడు నను నమ్మఁ జరియింతు నివ్విధమున. 40

టీ. హరి. కాలప్రాప్తుఁడు=మృతుఁడు, ఐన, సంతతికి = కుమారునికి, త్రోవఘటింపన్=రక్షణమునొనర్పఁగా, అరయన్=కోరి, అలసుకేశినిన్=ఆచంద్రమతిని, అను...నదిన్-అనుపమమైన=హితమైన, శీల=సద్వర్తనమందు, సత్పద్ధతినదిన్=ఆకాశగంగయైనదానిని, దొరసి=చేరి, నర...స్ఫూర్తి-నరవినుతమైన, దోర్మహాస్ఫూర్తిన్=బాహుశౌర్యస్ఫూర్తిగలవాఁడు, ప్రచ్ఛన్నాత్మమూర్తి = ప్రచ్ఛన్నమైన నిజస్వరూపముగలవాఁడు, ఆచక్రవర్తి=ఆహరిశ్చంద్రుఁడు, ఇట్లనున్ = ఈరీతిఁబలుకును, అవనిధవకులపాలిక-అవనిధవ (హరిశ్చంద్రునియొక్క-యనుట), కులపాలిక=కులస్త్రీయగు చంద్రమతి, ('కులస్త్రీ కులపాలికా' అ.) మహాత్మున్=హరిశ్చంద్రునిఁ గూర్చి, అగునని పూర్వమునకన్వయము. సాంద్ర...యేంద్రునింటన్-సాంద్రగుణములచేత, బంధురుఁడైన, అజాన్వయేంద్రు=బ్రాహ్మణునియొక్క, ఇంటన్ = ఇంటియందు, ఇనుఁడు = భర్త, ననున్, అమ్మన్=విక్రయింపఁగా.

నల. హేళిన్=ఆసక్తిచేతను, కాలప్రాప్తుఁడు-కాల = స్వయంవరనిర్ణయకాలమునకు, ప్రాప్తుఁడు=వచ్చినవాఁడు, ఐనసంతతికి = సూర్యసంబంధమైన వంశముగలవానికి (ఋతుపర్ణునకనుట.)ఇందుఁ 'గాలప్రాప్తుఁ'డను ప్రథమాంతపదమును 'ఐనసంతతికి' అను షష్ఠ్యంతపదమునకు విశేషణముగఁ జెప్పినందులకు లక్షణము.—

ఆ. "భేద్యభేదకముల భేదంబు సెల్లదు, వరవిభక్తిలింగవచనములకు
నొండుభేదకమున కుండును బ్రథమయు, జయము రక్షకుండు శౌరి కనఁగ."

ప్రయోగము.— (కవిలోకచింతామణి.)

మ. "వనితారత్నము తల్లమాంబకును శ్రీవత్సాంకతుల్యుండు పె
ద్దనకుం బుట్టిరి నందనుల్ విమలవిద్యాభారతీ వల్లభుల్." (నైషధము.)

త్రోవ, ఘటింపన్ = నడిపించుటకు, ఆరయఁగోరి = తెలిసికొనఁదలఁచి, అలసుకేశినిన్-అల=ఆ, సు=బాగైన, కేశిని యనుపేరుగలదానిని,అనుప=పంపఁగా, మహితశీల=దమయంతి, కర్త. మహితశీల యగుదమయంతి యనుపఁగా నని పూర్వమున కన్వయము. సత్పద్ధతిన్=మంచిమార్గముచేతను, అది=ఆకేశిని, దొరసినన్=చేరఁగా, రవి...స్ఫూర్తిన్-రవి=సూర్యునివలె, నుతమైన,దోర్మహాస్ఫూర్తి=భుజమహాస్ఫూర్తిగలవాఁడు, ప్రచ్ఛన్నాత్మమూర్తి, ఆచక్రవర్తి, అవనిధవకులపాలిక-అవనిధవకుల=రాజగృహమును, పాలిక=పాలించునది యగుకేశిని, మహాత్మ(న్)=నలునిఁగూర్చి, అను నని యన్వయము. సాంద్ర...నింటన్-సాంద్రగుణ=మంచిగుణములకు, బంధువైన, రాజాన్వయేంద్రుని=

ముసియొక్క, ఇంటన్, ధారిన్ = దాదిని, ఇనుఁడు = ప్రభువు, నను, నమ్మన్ = నమ్మునట్లు.

ఉ. మానవలోకచంద్ర విను మాన్యపుపట్టి మదీయజీవక
ల్పానఘమూర్తి గూఢచరణాధిపనిర్దయతానివేశితా
హీనతరార్తిపాల్పడియె నీయెడఁ దత్పతితత్వ మంతయున్
మానసమంత్రగౌరవచమత్కృతి గల్గినఁ దెల్పవే యనన్. 41

టీ. పం. మాన్యపుపట్టి=ఆ రాజకుమారుఁడు (లోహితుఁడనుట). మదీయ... మూర్తి-నా ప్రాణసదృశకల్పమైన, అనఘమూర్తిగలవాఁడు. గూఢ... తరార్తిపాలు-గూఢచరణాధిప=సర్పశ్రేష్ఠునియొక్క, నిర్దయచేత, నివేశితమైన, అహీనతరమైన, ఆర్తియొక్క, పాలు, పడియెను. ఈయెడన్=ఈసమయమున, తత్పతితత్వమున్ = ఆయార్తిఁబడుటను, అంతయున్=పూర్ణముగ, మానసమంత్ర... చమత్కృతి - సమంత్రగౌరవ=మంత్రగౌరవముతోఁగూడుకొనిన, చమత్కృతి, కల్గినన్, తెల్పవే=మేలు తెల్పవే, అనఁగా.

వ్యా. మాన్యపుపట్టి = మా రాజుకొమార్త, మదీయ... మూర్తి-మదీయజీవకల్ప=నా ప్రాణసదృశమైన, అనఘమూర్తిగలది, గూఢ... పాల్-గూఢమైన, చరణ=సంచరణముగల, అధిప = విభునియొక్క, నిర్దయచేత, నివేశిత = ఉంపఁబడిన, అహీనతరార్తి యొక్క, పాలు, పడియెను. నీయెడ=నీయందు, తత్పతితత్వము=అదమయంతీభర్తృస్థితి, మానస... చమత్కృతిన్-మానసమందలి, మంత్రగౌరవ=రహస్యగౌరవముయొక్క, చమత్కృతిగల్గినన్, (అనలునిస్థితి మనసునఁ దెలిసియుండినచో ననుట. నీయెడలఁ దద్భర్తృత్వమున్నచో, దెల్పుమని యర్థాంతరము.)

శా. చండాలేశమహోదయాత్తదినకృత్సంతానరాడ్వీరదా
సుండామేటి నిజప్రచారమున దాశుభ్రాంశుబింబాస్యతోఁ
బాండిత్యంబునఁ దెల్పి యిట్లను భవద్బాలాహితాపక్రియా
ఖండాపాయనివారణైకమహిమ ల్గాంచ న్నరేంద్రుండనే. 42

టీ. పం. చండా... దాసుఁడు-చండాలేశ=చండాలశ్రేష్ఠునియొక్క, మహోదయ=పుట్టువును, ఆత్త=పొందిన, దినకృత్సంతానరాట్=సూర్యవంశరాజుగాఁగల, వీరదాసుండు=వీరదాసుఁడను పేరుగలవాఁడు, ఆమేటి=ఆహరిశ్చంద్రుఁడు, భవద్బాలా... మహిమల్ - భవద్బాలా=నీకుమారునియొక్క, అహి=సర్పమువల్లనైన, తాపక్రియ=పరితాపక్రియచేత, అఖండమైన, అపాయముయొక్క, నివారణమందు, ఏక=ముఖ్యమైన, మహిమలు, గాంచను=పొందను, నరేంద్రుండనే=విషవైద్యుఁడనా? (నరేంద్రో విషవైద్యేఽపి వా... దిరవసుధాపతౌ" నానా.)

నల. చండాలేశ...రాడ్వీరదాసుండు-చండ=తీవ్రమైన, (ఇది 'మహ' శబ్దమున కువిశేషణము) ఆవేశ=అధికమైన, (ఇది 'దయా' శబ్దమునకు విశేషణము) మహః=ప్రతాపమును, దయయును, (ఇది క్రమాలంకారము) మహోదయ=అభ్యుదయమును, ఆత్త=పొందిన, దినకృత్సంతానరాడ్వీర = సూర్యవంశముగలరాజవీరునికి, (ఋతుపర్ణుని యొక్క-యనుట) దాసుండు; ఆమేటి=ఆనలుఁడు, భవ...మహిమల్-భవద్బాలా=మీ బాలికయొక్క, హిత=చెలిమిటివల్లనైన, అపక్రియా=అపకారముచేత, అఖండమైన, ఆపత్=ఆపదయొక్క, వినివారణమందు, ఏకమై, మహిమలు, నరేంద్రుండనే=రాజునా? లేక వార్తాహరుఁడనా? యనియుఁ జెప్పవచ్చును.

క. ఓలేమ యేతదవనీ, పాలనసంభావితార్థపరికల్పనకున్
జాలిన నిలు మిట లేదా, వైళమ చనుమింక మసలవల దిచ్చోటన్.

టీ. హరి. ఏత...కల్పనకున్ -ఏతదవనీ=ఈరుద్రభూమియొక్క, పాలన=పరిపాలనయొక్క, సంభావితమైన, అర్థ=ద్రవ్యముయొక్క, పరికల్పనకున్=ఇచ్చుటకు-

నల. ఏత...కల్పనకున్-ఏతదవనీపాలన=ఈఋతుపర్ణునియొక్క, సంభావితమైన, అర్థ=ప్రయోజనముయొక్క, పరికల్పనకు.

చ. అలఘుతరార్తవృత్తి గత యై నృపుదేవి ప్రియోక్తిఁ గ్రమ్మఱన్
గులపతిఁ జేరఁ బోయి యటకు న్గొనివచ్చినతత్తనూఁజుముం
గల నిది ధాత్రి నవ్యతరకాంతిసముజ్జ్వలరేఖఁ జిన్నిక్రొ
న్నెల నగు నీకుమారునికి నీ వనలాప్తి ఘటింపవే యనన్. 44

టీ. హరి. అలఘుతరార్తవృత్తిని, గత=పొందినది, ఐ, కులపతిన్=హరిశ్చంద్రుని, ఈకుమారునికి, నీవే, అనలాప్తి(న్)=అగ్నిసంస్కారమును, ఘటింపవే.

నల. అలఘుతరార్తవృత్తి(న్) - అలఘుతరమైన, ఆర్తవృత్తిచేత, గత=పోయి నది, ఐ, నృపుదేవిప్రియోక్తిన్=దమయంతియొక్క ప్రియవచనముచేత, కులపతిన్=నలుని, ధాత్రి=దాది, ఈ కుమారుని=ఈచిన్నికుఱ్ఱనికి, నీవ=నీవే, నలాప్తి(న్)=నలుని యొక్క-పరిప్రాప్తిని, ఘటింపవే, అనన్.

ఉ. మారునివంటిరూపసుకుమారుఁ గుమారుఁ గుమారజైత్రు నం
భోరుహపత్త్రనేత్రుఁ దనపుత్త్రునిఁ గాఁ దిలకించి యాత్మదు
ర్వారవిషాదవేదనల వ్రాలియు నాకృతిగోపనక్రియా
పారగుఁ డై నృపాలకుఁ డపారకృపారసదృష్టి నిట్లనున్. 45

టీ. రెంటికి సమానము.

చ. రతిపతిమూర్తి యీనిసువు రాజసుతుం డగు గూఢభావసం
స్థితజనకాననంబుఁ గనఁజేయుటకు న్వగ లేక మానునే

మతిఁ బరికింపనేల యిది మాటికి నేఁ బరతంత్రకాలఘు
స్థితి మనుదుర్గతిక్ గృతగతిక్ భవదిష్టము సేయ నేర్తునే. 46

టీ. హరి. గూఢభావ=గూఢమైనయభిప్రాయముగలదానా? సంబుద్ధి. (గుట్టుగల దనుట) సంస్థితజనకాననంబుక్-సంస్థితజన=ప్రేతజనులయొక్క, ('పరేతప్రేతసంస్థితాః. అ.) కాననంబుక్, (ప్రేతవనము ననుట) వగలేకమానునే= (గతిలేకపోవునాయనుట.)

నల. గూఢ...ననంబుక్ - గూఢభావ = గూఢత్వముచేత, సంస్థిత = ఉండెడు, జనక=తండ్రియొక్క, ఆననంబుక్=మొగమును, కనఁజేయుటకుక్, వగలేకమానునే?= (లేకపోవునా యనుట.)

తే. ఎగ్గు వాటించు నాస్వామి యెటఁగనేని
వారిజాక్షి యేతద్భూమివర్తన యిది
మానవే యన్న నాసుధామధురవచన
యరుగ కనునయశీల యై యచట నిలిచి. 47

టీ. హరి. ఏతద్భూమివర్తన - ఏతద్భూమి = ఈరుద్రభూమియొక్క, వర్తన, (వర్తనరూపమున వచ్చుబడిపైఁడియనుట.) వేయన్నక్=వేయిచెప్పినను, ఇది, మానక్= విడువను, నాక్=అనఁగా, సుధామధురవచన=చంద్రమతి.

నల. ఏతద్భూమివర్తన=ఇచట వర్తించుటను, ఇది మానవే, అన్నక్=అనఁగా, ఆసుధామధురవచన=ఆకేశిని.

తే. జనవిభుఁడు పాకసంస్కారసాధనముగ
ననితరప్రాప్యగతిఁ జెందునప్రయత్న
మహితశుచిజీవనావాస మంగళగుణ
మరసి యటుతఁ దెల్పినఁ గుంది యావెలంది. 48

టీ. హరి. పాక...ధనముగక్-పాక=పిన్నవానియొక్క ('పోతః పాకోఽర్భకో డింభః' అ.) సంస్కారమునకు, సాధనముగా, అనితరప్రాప్యగతిక్ - అనితరప్రాప్య= ఇతరులకుఁ దెలియ శక్యముగాని, గతిక్, (అన్యులకుఁ గానరాకుండునది యనుట.) చెందు...గుణముక్ - చెందు=పొందిన, అప్రయత్నముచేత, మహితమైన, శుచిజీవన= పవిత్రజీవనమునకు, ఆవాస=ఆధారమైన,మంగళగుణముక్=మంగళసూత్రమును,అరసి= చూచి, అటుతక్=కంఠమందు.

నల. పాకసంస్కారసాధనముగక్, పాకసంస్కార = పచనసంస్కారమునకు, సాధనముగా, అనితరప్రాప్యగతిక్=అన్యులకుఁబొందరానిగతిని, చెందు...గుణముక్- చెందిన, అప్రయత్నముచేత, మహితమైన, (యత్నములేక కలిగినయనుట.) శుచిజీవన= అగ్నిజలములకు, ఆవాసమైన, మంగళగుణ=శుభగుణమును, అరసి=తెలిసికొని, అటు తక్=(దమయంతి)సమీపమున, తెల్పినక్=చెప్పఁగా, ఆవెలంది=ఆదమయంతి, కుంది.

ఉ. తప్పదు ప్రాణవల్లభుఁ డితం డని యారసి హా నృపాల! వా
తప్పక నిత్యసత్యసుకృతంబునఁ బొల్చుపవిత్రశీల నీ
విప్పుడు దీనతం బరమహీనుని నొక్కని గొల్చి యుండఁ గా
నిప్పృథివీపురంధ్రి సహియించెనె దైవము మెచ్చవచ్చునే. 49

టీ. హరి. పరమహీనునిన్=పరముఁడైన చండాలుని.

నల. పరమహీనునిన్-పర=ఇతరుఁడైన, మహీనునిన్=రాజును.

క. అని వనరి వనరుహానన, కనుదమ్ములఖండబాష్పకాండాకలనన్
దనరన్ గురువాక్యాహూత, నిజాధిప యై యగణ్యతరదైన్యమునన్.

టీ. హరి. గురు...జాధిప - గురు=అధికములైన, వాక్యములచేత, ఆహూత=పిలువఁబడిన, నిజాధిప=హరిశ్చంద్రుఁడుగలది, ఐ.

నల. గురు...జాధిప - గురు=జనకునియొక్క, వాక్యముచేత, ఆహూత=పిలువఁబడిన, నిజాధిప=నలుఁడుగలది, ఐ.

సీ. రా వేల మద[1]నిర్ఝరా వేల సౌరభ్య
లోభలుబ్ధాళిభద్రేభఘటలు
తగ వేల చూడఁ గ్రొత్తగ వేలసంఖ్య లై
పడివాగెఁ బఱతెంచు ప్రౌఢహరులు
తనర వేల జయాయతనరవేలాధర
ప్రతిమతుంగశతాంగశతశతములు
కలయ వేల భయానకలయ వేలాఘనా
ఘనగర్జలగుణానకస్వనములు
తే. మించ వేల తనుప్రభల్ మించుగముల
మించ వేలాస్యము లొనర్చు మెఱుఁగుఁబోండ్ల
తరళవలయఝుళంకృతుల్ ధావకాగ్ర
సరణి రాజేంద్ర! రాంజేంద్రసరణి ననుచు. 51

టీ. రెంటను సమము.

చ. అడుగుల వ్రాలి శోకకలితాకులతాచలితాత్మవీథి యై
నడుకుచుఁ బ్రాణనాథ! కరుణాభరణాభరణాంతరంగ నీ
కొడుకు తెఱంగుఁ గోమలి నెగుల్ దిలకింపఁ గదయ్య నేఁడు నీ
బొడఁగనఁ గల్గెఁ జాలుఁ దలఁపు ల్దరితార్థము లయ్యె నెంతయున్. 52

1 నిర్భరా.

టీ. రెండిటను సమానము.

క. అన నాజననాథాగ్రణి, మననాధికశోకశిఖల మానసమారిం
గన నాచ్ఛాదించి కులాంగన నాత్మకథావిబోధకారిణిఁ బలికెన్. 53

టీ. అంతర్థముల సౌక్యము.

చ. *కుదురు మెఱుంగు నిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్
సెదరఁగ నేల యేడ్చెదవు చెల్వ! దురంతవిషాదవేదనా
విదళితమానసాబ్జ వయి వేమఱు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివిపాకము దాఁట తరంబె యేరికిన్. 54

టీ. రెంటను సమానము.

తే. అఖిలదేశంబులు సదాసహాయవృత్తి
సెఱిపితి విలాసవతి! యిట్టినిన్ను నమ్మి
కనుఁగొనుట యెట్లు నిర్విశంకత దలిర్ప
నిపు డెదుట నిల్చి మాటాడు టెట్లటన్న. 55

టీ. హరి. సదాసహాయవృత్తి=నిరంతర సహాయవృత్తిని, సెఱపితి=ఆచరించితి, ఇట్టినిన్ను=ఇటువంటినిన్ను, అమ్మి.

నల. సదా, అసహాయవృత్తి, సెఱిపితివి, ఒంటరిగాఁ దిరిగితి వనుట. నమ్మి గనుట్=విశ్వసము చేసి, కొనుట=పరిగ్రహించుట, ఎట్లు?

క. తలఁపునఁ దద్గుణరాగముఁ, గలయనిలాధిపతి నాతిఘనతరవేగం
బలరఁగఁ దత్పదమునవ్రాలి లసన్మృదులోక్తికందళిక నిట్లనియెన్.

టీ. హరి. తద్గుణరాగముగ్-తత్=హరిశ్చంద్రునియొక్క, గుణములయందలి, రాగముగ్, కలయుగ్=ప్రాపింపఁగా, ఇలాధిపతినాతి=చంద్రమతి, తత్పదమున=ఆహరిశ్చంద్రునిపాదద్వయమున, వ్రాలి=పడి. (ఇందుఁ తత్పదమును నపుంసకమునను, 'స్తనాదీనాంద్విత్వవిశిష్టాజాతిః'' అను వామనసూత్రము చేత, ద్విత్వమున జాత్యేకవచనము.)

నల. తలఁపునన్, తద్గుణరాగమున్-తత్=ఆదమయంతియొక్క, గుణ=పాతివ్రత్యాది గుణములయందలి, రాగముగ్=అనురాగమును, కలయనిలాధిపతి, కలిగిన, అనిలాధిపతి=వాయుభట్టారకుఁడు, నాతి... వేగంబు - నాతిఘనతర = అతిఘనతరముగాని, వేగంబు, (మిక్కిలి వడి) యలరఁగా, తత్పదమున(న్)=ఆస్థలమందు, వ్రాలి=నిలిచి.

ఉ. మందరధీర! ధీరనుతమానస! మానసమగ్ర! యిట్లు ప
ల్కంగ దగునే భవత్ప్రమదగౌరవ హేతుపవిత్రభావని

* ఈపద్యము శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునం గలదు.

ష్పందచరిత్ర సంపదకు సాక్షులు గోవిధుకర్మసాక్షు లీ
చందమునన్ భవదాత్మజలజంబునఁ జింత యొనర్ప నేటికిన్. 57

టీ. హరి. భవ...సంపదకు - భవత్ = నీయొక్క, చరిత్రసంపదకు విశేషణము. ప్రమదగౌరవ=సంతోషాతిశయమునకు, హేతువైన, పవిత్రతచేతను, నిష్పంద=చలింపని, చరిత్రసంపదకు.

నల. భవత్ప్రమద=నీభార్యయొక్క.

తే. అనుచు విన్నందనమితనయాంచితోక్తి
నుడుప లలితాస్య నెనసి యయ్యురుతరస్థి
రావహనకేళి ఫణికుమారప్రయుక్త
నేత్రభవభువనాధికోన్మేషుఁ డగుచు. 58

టీ. హరి. విన్నందనము(న్), ఇత... క్తిన్ - ఇత=పొందఁబడిన, నయముచేత, అంచితమైన,ఉక్తిన్=వాక్యముచేత, ఉడుపన్=పరిహరింపఁగా, లలితాస్యన్, (చంద్రమతిననుట,) ఎనసి, ఆ, అయ్యా, ఉరు...ఫణిన్ - ఉరుతరస్థిరావహనకేళిన్ = భూభరణక్రీడయందు, ('రసావిశ్వంభరాస్థిరా' అ.) ఫణి = శేషుఁడైన హరిశ్చంద్రుఁడు, కుమార...న్మేషుఁడు-కుమార = లోహితకుమారునియందు, ప్రయుక్త = ప్రయోగింపఁబడిన (నింపఁబడినయనుట.) నేత్రభవ=నయనజనితమైన, భువన=ఉదకముయొక్క, ('జీవనంభువనంవనమ్.' అ) ఉన్మేషుఁడు = ఆధిక్యము గలవాఁడు, అగుచు, (భార్యాయుక్తుఁడై కన్నీరులోహితునిమీఁదం బడునట్లు దుఃఖించె ననుట.)

నల. అనుచు, విన్నందున్=ఆకాశమందు, ('వియువిన్ను మినుమిన్ను' ఆం. సం.) అన(న్)=వాయుభట్టారకుఁడు పల్కఁగా, మిత...తోక్తిన్-మితమై, నయాంచితములైన, ఉక్తిన్=వాక్కులు గలదానిని, ఉడుపలలితాస్యన్ - ఉడుప = చంద్రునివలె, లలితమైన, ఆస్యన్=ముఖముగలదాని, (దమయంతిననుట.) ఎనసి = కూడి, అయ్యురు...కేళి-ఆ, ఉరుతరమైన, స్థిరావహన=భూభరణమందు, కేళి= కేళిగలవాఁడు (నలుఁడనుట), ఫణి...న్మేషుఁడు-ఫణికుమార=కర్కోటకునిచేత, ప్రయుక్త=ఈఁబడిన, నేత్రవస్త్రమువల్ల ('స్యాజ్జటాంశుకయోర్నేత్రం'అ.) భవ=పుట్టిన, భువనాధికమైన, ఉన్మేషుఁడు = దేహప్రకాశముగలవాఁడు, అగుచు.

ఉ. భూనుతపూర్వరూపధృతిఁ బొల్చి నితాంతదురంతమానస
జ్యాని వహించుమానిని వసంతతి సద్విధిఁ దేర్చి యయ్యయో
ధ్యానగరాధినేత వెస నంపె యథోచితమైన వర్తనన్
దేనియ మించి యబ్బురపుఁదీయఁదనంబులు సిల్కఁబల్కులన్. 59

పదేశ=ఆకాశిరాజుయొక్క, పదముల్=ఇంటిని, ఆక్రమించి=ప్రవేశించి, తత్ప్రజన్ = ఆరాజుపుత్రుని, ('ప్రజాస్యాత్సంతతౌ జనే' అ.) దస్యుఁడు=దొంగ, ప్రతీప...సాధ్యుఁ డు - ప్రతీప=ప్రతికూలుఁడైన, గాధేయ = విశ్వామిత్రునియొక్క, శాంబరియనెడు, సాధనముచేత, ఆఢ్యుఁడు, పుష్కరాభిఖ్యుఁడు=పుష్కరుఁడనువాఁడు, ఎదిరించి=ఎదురుగావచ్చి, ఆనృపాలునువిద=చంద్రమతి, లోఁబడునట్లు, కైతవమొనర్చి = కపటమును చేసి, తద్వసుమతి=ఆచోరద్రవ్యముగలచంద్రమతి, రాజ...పాత్రము-రాజశాసన = రాజాజ్ఞకు, ఏక=ముఖ్యమైన, పాత్రము, ఐ, తద్వీరబాహువసతి, (చెందె నని పూర్వముతో నన్వయము.)

నల. ధర్మ...యొద్దన్ - ధర్మపరిగ్రహ=తనధర్మపత్నియొక్క, గురునియొద్ద= తండ్రియొద్ద, (భీమునియొద్దననుట) తత్సంతతిన్=ఆయనకుమారికను, అధ్యక్ష...మతి - అధి=అధిగతమైన, అక్షహృదయ = విద్యామర్మముయొక్క, బోధ = తెలియుటచేత, సమగ్రమైన, మతి=బుద్ధిగలవాఁడు, నలసన్నారి, నల=తృణమువలె, సన్న=ఛేదింపఁబడిన, అరి=శత్రువులుగలవాఁడు (నలుఁడనుట), కర్త=చనన్, (రాజ్యపరిగ్రహణార్థము పోఁగా ననుట.) తజ్జనపదేశుపదము=ఆరాజుయొక్కరాజ్యము, దస్యుఁడు=శత్రువు, ('దస్యుశాత్రవశత్రవః' అ.) ప్రతీప...సాధ్యుఁడు-ప్రతీపగ = కుటిలవర్తనులకు, ఆధేయమైన, శాంబరి=మాయయనెడిసాధనముతో, ఆఢ్యుండు, ఆనృపాలునువిద=దమయంతి, లోఁబడునట్లుగా, కైతవము=జూదము, ఒనర్చి, (జూద మాడి యనుట.) తద్వసుమతి = ఆభూమి, రాజశాసనైకపాత్రము - రాజశాసన = ఆరాజపరిపాలనకు, ఏకపాత్రము = యోగ్యము, ఐ, తద్వీ...సతిన్-తత్=ఆ, వీరుఁడైన నలునియొక్క, బాహువందలి, వసతిన్ = ఉనికిని, చెందె ననిపూర్వముతో నన్వయము.

సీ. తద్వేళ భీమగోదారసంప్రేషితయగుచుఁ బ్రజావృత యగుచు రాజ
ధామచౌర్యప్రథాధార సల్లపనసందీపిత యగుచు నాత్మీయవనిత
తనయునిఁ గూడి సేరియు క్తిక్రియానుగుణవృత్తివహింపనాధరాధీశమానిని
నిజవిధానవిఘాత నిరతవిశ్వామిత్రపరిహారణోత్సాహపటిమ మెఱసి

తే. వరుసఁ బ్రత్యర్థిమండలస్వాస్థ్యహేతు
దానఘనతరవారిధారానితాంత
హారిహస్తసరోరుహుం డగుచుఁ బ్రీతి
నిలయజనవర్ధనప్రౌఢి నించువేళ. 61

టీ. హరి. భీమగోదారసంప్రేషిత-భీమ=భయంకరుఁడైన, గోదార=గోహింసకుఁడైన వీరబాహునిచేత, ('గాః దారయతీతి గోదారః' వ్యుత్పత్తి. 'దౄ = విదారణే' ధాతువు.) సంప్రేషిత=పంపఁబడినది, అగుచు, ప్రజావృత=ప్రజలచేతఁ బరివేష్టింపఁ,

=పక్షెరముగలవాఁడా! (బ్రహ్మకపాలము పళ్లెరముగాఁ గలవాఁడనుట.) దివ్య...మణీ- దివ్య=దేవతలయొక్క, భృతి=రక్షణమును, కృత్=చేసెడు, చూడామణీ=శిరోరత్నముగలవాఁడా! (చంద్రశేఖరుఁ డనుట) విత్ర...నేత్ర - విత్రసత్=భయపడుచున్న, గోత్ర=గోసమూహముగల, ('గవ్యాగోత్రాగవాం' అ.) ఉదంచిత=మనోహరమైన, నేత్ర=వస్త్రముగలవాఁడా! (వ్యాఘ్రాజినధారి యనుట.) హ్రాదినీధారకా- హ్రాదినీ=నదిని, ధారకా=ధరించినవాఁడా! ('తటినీ హ్రాదినీధునీ'' అ.)

నల. ధాత్రీ...ప్రియా-ధాత్రీ=భూమియందు, స్యందన=స్రవించుటచేత,విస్తృతమైన, ఆగమ=రాకడగల, మహాధారాట=అశ్వములయొక్క,ధాటీ=దాడి,ప్రియముగ గలవాఁడా! (మేఘవాహనుఁ డనుట.) వృత్ర...విఖ్యాత-వృత్రాసురుఁడనెడు చీఁకటి యొక్క, ధ్వంసమును, విధాయక=చేసెడు, అంబకమహః=బాణప్రతాపమనెడు, అవి= సూర్యునిచేత, విఖ్యాతుఁడైనవాఁడా! (వృత్రధ్వంసవిధాయక=వృత్రాసురనాశకరమైన, అంబకమహః=బాణతేజముచేత, విఖ్యాతుఁడైనవాఁడా! యనియుఁ జెప్ప నొప్పు.) సత్యో...పాత్ర - సత్యోదిత=సత్యవాక్కులయొక్క,(ఋషులయొక్కయనుట.)స్తోత్ర పాదనమునకు, పాత్రమైనవాఁడా! దివ్యభృతికృచ్చూడామణీ! దివ్య=దేవతలను, భృతికృచ్చూడామణీ=రక్షకశిరోమణి యైనవాఁడా!విత్ర...నేత్ర - విత్రసత్=భయపడుచున్న, గోత్ర=పర్వతములుగల, ఉదంచితనేత్రములు గలవాఁడా! హ్రాదినీధారకా!=వజ్రాయుధము ధరించినవాఁడా! ('హ్రాదినీవజ్రమస్త్రీస్యాత్' అ.)

చ అని యధికాంబకు న్పొగడి యంచితసత్కరుణీసుధావలో
కనమున సేదదేరి యలకౌశికుఁ డిచ్చుననంతరాజ్యపా
లనవిభవంబు దన్మహితలాలనచాటుపురస్సరంబుగా
నెనసి నృపాలుఁ డొప్పెఁ బునరిద్ధకళాకలితేందువైఖరిన్. 67

టీ. హరి. అధికాంబకున్=త్రిలోచనుని, అలకౌశికుఁడు=ఆవిశ్వామిత్రుఁడు.

నల. అధికాంబకున్=సహస్రాక్షుని, కౌశికుఁడు=ఇంద్రుఁడు.

క. ఆశాంతగజావధిపృథి
వీశాశ్వతభోగభాగ్యవిభవము లటు లు
ర్వీశునకుఁ గృప నొసంగి హ
వాశనతిలకుఁడు తిరోహితాత్మకుఁ డయ్యెన్. 68

టీ. హరి. హవాశనతిలకుఁడు - హవాశన=అగ్నిహోత్రుఁడు, తిలకుఁడు=తిలకముగాఁగలవాఁడు, (శివుఁడనుట.)

నల. హవాశనతిలకుఁడు=దేవేంద్రుఁడు.

మ. అపుడాశాంతనిశాంతసామజసమాజాధారదోస్సారుఁడై
విపులావల్లభుఁ డాత్మవంశనగరీవిఖ్యాతసామ్రాజ్యభ

ద్రపదశ్రీ నిరవాంగి యాప్తజనచేతశ్చాతకప్రీతిదా
నవాయోదానఘమూర్తిగాయి వెలసె భూనాథాగ్రణుల్గొల్వఁగన్. 69

టీ. రెంటను సనూనము.

సీ. అతను పావక [1] దీపికాభితాపము డించె
నతులామహార్ష సామగ్రిఁ జెందె
వనమాలిదుర్గ్రాహ వప్రకింపము జాఱె
నిష్టలీలాస్ఫూర్తి లింపు మీఱె
ఖరరాజకరజాత కాతరత్వ మడంగె
గరిమఁ జెలంగి యంగములు పొంగె
మదమత్తశరభృత్సమయచయంబు శమించె
నాకల్పసద్విభు లతిశయించె

తే. సమరసుతవైభవుని వివేకాబ్జభవుని
భవునిఁ దేజోరవింద బాంధవునిఁ బాసి
యొట్టకేలకుఁ గ్రమ్మఱ నెనసి వసుమ
తీమహారాజ్యలక్ష్మి సుస్థిరత నిలువ. 70

టీ. రెంటను సమము.

తా. ఇంక రాజ్యలక్ష్మి యితరబాధలు లేక సుఖంబున నుండె నని చెప్పుటచేఁ బ్రియవిరహమువల్లనైన మదనాగ్నితాపాధిక్యాదులు లేక యుండె నని స్ఫురించుచున్నది.

క. అని యిట్లు పాండుసుతునకు
జనసుతుఁడు మృకండుసుతుఁడు చతురత నెఱిఁగిం
చినయీవిచిత్రకృతి విను
ఘనులకు సిరు లొసఁగు సుమిత్రాసుకరవంశభవా!.

శా. నమ్రారామవసంత! సంతతనుతిన్యస్తాదరాహార్యజా
కమ్రస్వాంతనిశాంత! శాంతభయరింఖద్దేవమర్త్యాంతకృ
ద్ధూమ్రాక్షాదికృతాంత! కాంతభృగురాడ్దోర్దర్పతేజోమహా
గామ్రాంశుక్షణదాంత! దాంతజనసంత్రాణైకచింతామణీ! 72

టీ. నమ్రా...వసంత, నమ్ర=నతులైన - ఆరామములకు, వసంత=ఆమనియైన వాఁడా! సంతత...నిశాంత - సంతతనుతియందు, న్యస్త=ఉంపఁబడిన, ఆదరముగల,

1 పీడితా.

ఆహార్యజా=పార్వతియొక్క, కమ్ర=మనోజ్ఞమైన, స్వాంత=మనస్సే, నిశాంత=గృహముగాఁగలవాఁడా! శాంత...కృతాంత-శాంతభయ=నిర్భయముతో, రింఖత్=చరించుచున్నవారై, దేవమర్త్య=దేవమానవులయొక్క, అంత=నాశమును, కృత్=చేసెడు ధూమ్రాక్షాదిరాక్షసులకు, కృతాంత=అంతకుఁడైనవాఁడా! తాంత...దాంత - తాంత=వాడిన భృగురాట్=భార్గవునియొక్క, దోర్దర్ప=తేజమునెడు, మహత్=అధికుఁడైన, తామ్రాంశు=సూర్యునికి, క్షణదాంత=ప్రాతఃకాలమైనవాఁడా! దాంతజన...మణీ-దాంతజన=ఋషిజనులయొక్క, సంత్రాణమందు, ఏక=ముఖ్యమైన, చింతామణియైనవాఁడా!-

క. కంజభవాభవచేతో,రంజన! ఖరభంజనా! నిరంజనజనజీ
వంజీవకాజవంజవ,సంజీవకచరణ నఖర చంద్రమయూఖా!. 73

టీ. కంజ...రంజన - కంజభవ=బ్రహ్మయొక్కయు, అభవ=శివునియొక్కయొక్క చేతః=చిత్తమును, రంజన = రంజింపఁజేయువాఁడా! ఖరభంజన=ఖరాసురసంహారియైనవాఁడా! నిరంజన...మయూఖా-నిరంజనజన=నిష్కల్మషజనులనెడు, జీవంజీవక=చకోరములయొక్క, ఆజవంజవ=సంసారమునకు, సంజీవక=రక్షకమైన, చరణనఖరచంద్రమయూఖములు గలవాఁడా!

పంచచామరము. అయాశ్రయాంధరాధరాహృతాహితాహితాన్వితా
జయావ్యయా పరాపరా యసాధ్వసాహసాహసా
నయాలయా నిరాకరా సనాతనా జనావనా
దయామయా చిరాదరా సదా ప్రదాచిదాస్పదా! 74

## కృతి కర్తృగద్యము.

ఇది శ్రీరామచంద్ర చరణారవిందవందనపవననందన ప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకషచతుర్విధకవితానింబాకసాహిత్యరసపోషణ రామరాజభూషణకవిప్రణీతంబైన హరిశ్చంద్ర నళోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

## వ్యాఖ్యాతృగద్యము

ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర భారద్వాజగోత్రపవిత్ర చిత్రకవిపెద్దిరాజతనూజ పురాతనాధునాతనకఠినప్రబంధార్థబోధనసమర్థమానసాంభోజ బుధజనవిధేయానంతయనామధేయ విరచితంబైన "హరిశ్చంద్రనలోపాఖ్యాన ప్రకాశిక" యనువ్యాఖ్యయందు సర్వంబును బంచమాశ్వాసము. శ్రీ. శ్రీ. శ్రీ.

చెన్నపురి : వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే
శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1930.